# వయోజన విద్యావ్యాప్తి
## మన కర్తవ్యం




ండలి వెంకట కృష్ణారావు

# వయోజన విద్యావ్యాప్తి

## మన కర్తవ్యం

రచన:

మండలి వెంకట కృష్ణారావు

సంపాదకుడు

డా॥ వెలగా వెంకటప్పయ్య

గాంధేయ -సమాజ సేవా సంస్థ

గాంధీ క్షేత్రం – అవనిగడ్డ

# Vayojana Vidya Vyapthi Mana Karthavyam

by
M.V. KRISHNA RAO

ప్రథమ ముద్రణ - 1989

గాంధేయ సమాజ సేవా సంస్థ

ప్రచురణ నెం.10

వెల : 4.00

ముద్రణ

రూత్ డైక్‌మన్ ప్రింటింగ్ ప్రెస్

గాంధీక్షేత్రం - అవనిగడ్డ.

–

# ముందుమాట

భారతదేశాన్ని ఈనాడు నిరక్షరాస్యత, పేదరికం అనే రెండు బృహత్తర సమస్యలు పీడిస్తున్నాయి. ఈ రెండు జటిల సమస్యలు పరిష్కారం కానిదే దేశం ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా పురోగమించలేదు. ఈ పరిస్థితిని భారత ప్రభుత్వం గమనించి దేశవ్యాప్తంగా పెద్ద స్థాయిలో వయోజన విద్యా కార్యక్రమాన్ని నిర్వహించడానికి 1977లో విధాన నిర్ణయం చేసి 1978 అక్టోబరు 2వ తేదీ భారతజాతిపిత మహాత్మా గాంధీ గారి జన్మదినంనుంచి అమలుపరచింది.

ఈ కార్యక్రమం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఒక క్రమబద్ధమైన రీతిలో 1980 నుంచి అమలు జరిగింది. ఈ కార్యక్రమం అమలు జరుగుతున్న తొలి దినాలలో కార్యకర్తల కోసం, ఈ కార్యక్రమాన్ని తగినంతగా ప్రచారం చేసే నిమిత్తం ఆనాడు వయోజనవిద్యా శాఖను నిర్వహిస్తున్న మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ADULT EDUCATION అనే మోనోగ్రాఫ్ రాశారు. ఈ మనోగ్రాఫ్ నాటి అధికార, అనధికారులకు బాగా ఉపయోగపడింది.

ఈలోగా భారతప్రభుత్వం 1986లో నూతన విద్యావిధానాన్ని (New Educational Policy) ప్రకటించింది. ఈ విధానంలో ఒక భాగంగా జాతీయ అక్షరాస్యతా ఉద్యమాన్ని (National Literacy Mission)ను 1988 మే 5వ తేదీన భారత రాజధానిలో ప్రారంభించి దేశవ్యాప్తంగానూ, మన రాష్ట్రంలోనూ అమలు జరిపారు. దీనివలన అక్షరాస్యతా కార్యక్రమం వ్యవస్థీకృతం చేయబడి, మరింత బాగా అమలు పరచడానికి ఏర్పాట్లు జరిగాయి.

ఈ విధంగా ఈ కార్యక్రమంలో జరిగిన అనేక మార్పుల దృష్ట్యానూ, తెలుగు అధికార భాషగా అన్ని స్థాయిలలో అమలు జరుగుతున్న దృష్ట్యానూ, ఒకనాడు ఆంగ్లంలో శ్రీమండలి వెంకటకృష్ణారావు తయారుచేసిన మానోగ్రాప్‌ను తగిన చేర్పులు, మార్పులూ చేసి తెలుగులో ప్రచురించాలనే ఆలోచన కలిగింది. నేడు అవసరమైన సవరణలు చేసేందుకు గ్రంథాలయ, వయోజన విద్యా రంగాలలో

అపారమైన కృషి చేసిన ప్రముఖ కార్యకర్త డా॥ వెలగా వెంకటప్పయ్య గారిని కోరగా వారు అనతికాలంలో ఈ పని జయప్రదంగా పూర్తిచేసి ఇచ్చినందుకు వారికి కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

శ్రీ మండలి వెంకట కృష్ణారావు ప్రముఖ గాంధేయవాది, జాతీయవాది, అవనిగడ్డలో గాంధీక్షేత్రం అనే మహత్తర సేవాసంస్థను నెలకొల్పి గాంధీజీ నిర్మాణ కార్యక్రమాన్ని అమలు జరుపుతున్నారు. 1977లో గాంధీజీ 109వ జయంత్యుత్సవాల సందర్భంగా గాంధీక్షేత్రం ద్వారా 109 వయోజన విద్యా కేంద్రాలను వివిధ గ్రామాలలో పెద్దఎత్తున నెలకొల్పి దిగ్విజయంగ నడిపించారు. వయోజన విద్యాశాఖకు అమాత్యులుగా పనిచేసి వయోజన విద్యా కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగ రూపొందించారు. రాష్ట్రస్థాయిలో వయోజనవిద్యా సంఘాన్ని నెలకొల్పారు. సమాజ సేవారంగంలో కాకలు తీరిన యోధుడైన శ్రీ కృష్ణారావుగారు వ్రాసిన ఈ చిరుపొత్తం వయోజనవిద్యా కార్యకర్తలకు కరదీపికగా ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాము.

ఇంతకుముందువలె ఈ చిరుపొత్తాన్ని ప్రోత్సహించి సమాదరిస్తారని, ఈ కార్యక్రమ లక్ష్యాలను తెలుసుకొని భారతప్రభుత్వం ఇందునిమిత్తం ఖర్చుచేస్తున్న కోట్లాది రూపాయల ప్రజాధనవ్యయానికి సార్థకత చేకూర్చుతారని నమ్ముతున్నాను.

వయోజనవిద్యా కార్యక్రమాన్ని ఒక ఉద్యమంగా రూపొందించి అమలు జరపాల్సి ఉంది. అందులకు ప్రతి పౌరుడు బాధ్యత నిర్వర్తించుటలో ముందుకు రావాలని కోరుతున్నాను.

జై హింద్.

కోదాటి నారాయణరావు, అధ్యక్షులు,
గాంధేయ సమాజ సేవా సంస్థ.

ఇందులో.......

# వయోజన విద్య

వయోజన విద్యా సమస్య మనకు కొత్తేమీ కాదు. మనదేశానికి స్వాతంత్ర్యం రాకముందే ఈ సమస్య మన దేశ నాయకులను, విద్యావేత్తలను వేధిస్తున్నది. వివిధ సాంఘిక, రాజకీయ శక్తుల వలన కలిగిన ఈ సమస్య మనదేశ చరిత్రపై ప్రభావం చూపుతున్నది.

అజ్ఞానం, పేదరికం, జబ్బులు మొదలైనవి ప్రపంచంలో ఎల్లప్పుడూ ఉండే కీడులు. మరీ ముఖ్యంగా రెండవ ప్రపంచ యుద్ధం తరువాత అనేక అభివృద్ధి చెందిన దేశాలు ఈ కీడుల వలన చాల బాధలు పడ్డాయి. దీనినుండి భారతదేశానికి మినహాయింపు లేదు. ప్రపంచ యుద్ధం జరిగిన తరువాత కాలంలో ఈ కీడులను తొలగించడానికి కనికరంలేని యుద్ధాన్ని ప్రపంచమంతట జరపడానికి జాతీయ వనరులను, అంతర్జాతీయ శక్తులను కదలించడానికి అనేక ప్రయత్నాలు చేశారు. ఐనా ఈ యుద్ధం ముగియలేదు. ఈ భయంకరమైన బంధాలనుండి ప్రజలకు విముక్తి కలిగించే గమ్యాలను చేరవలెననిన ఏకాగ్రత కలిగిన ప్రయత్నాలు, దీక్ష కలిగిన కృషి అవసరం. అన్నిటి కన్న నిరక్షరాస్యత వలన కలిగే అజ్ఞానం సమస్యలన్నిటికీ మూలం. భూమిపై గల నిరక్షరాస్యతను విజయవంతంగా నిర్మూలించగల్గితే మిగిలిన రెండు కీడులు అనగా – పేదరికం, అనారోగ్యాన్ని సులభంగా అరికట్టవచ్చు. మానవుడు నిరక్షరాస్యత వలన సంపాదించే శక్తిని కొల్పోతున్నాడు. పేదరికం అనారోగ్యానికి దారితీసి అనేక జబ్బులకు గురౌతున్నాడు. కావున ఈ దుష్టవలయం అనేకులను మ్రింగివేస్తూ వారికి చితికిన జీవితాలనిచ్చే వేగంగా వచ్చు తుఫాను లాగ ఉంది. ప్రకాశమానమైన నాగరికతకు ఎదగకుండ వారిని అట్టడుగునకు త్రోసివేస్తున్నది. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన భారతదేశంలో నిరక్షరాస్యతను నిర్మూలించడానికి అక్షరాస్యత అను దీపాన్ని

వెలిగించడానికి గృహంలో ప్రయత్నం జరిగింది. ఐనప్పటికిని అక్షరాస్యత శాతం తృప్తికరంగా లేదు.

జనాభా - విద్యాశాతం :

ఇతర రాష్ట్రాలతో పోల్చుకున్నట్లయితే 1971 నాటికి మనం 22వ స్థానంలో ఉంటే, 1981 నాటికి 23వ స్థానానికి దిగిపోయాం. వివరాలలోకి పోతే ఇలా ఉంటాయి.

| 1981లో స్థాయి | రాష్ట్రం/కేంద్ర పాలిత ప్రాంతం | విద్యాశాతం 1981 | విద్యాశాతం 1971 | 1971లో స్థాయి |
|---|---|---|---|---|
| 1. | కేరళ | 70.42 | 60.42 | 2 |
| 2. | చండీఘర్ | 64.79 | 61.56 | 1 |
| 3. | ఢిల్లీ | 61.54 | 56.31 | 3 |
| 4. | మిజోరమ్ | 59.88 | 53.79 | 4 |
| 5. | గోవా, డయ్యూ, డామన్ | 56.66 | 44.75 | 6 |
| 6. | పాండిచేరి | 55.55 | 46.02 | 5 |
| 7. | లక్షదీవులు | 55.07 | 43.66 | 7 |
| 8. | అండమాన్, నికోబార్ | 51.56 | 43.59 | 8 |
| 9. | మహారాష్ట్ర | 47.18 | 38.18 | 10 |
| 10. | తమిళనాడు | 46.76 | 39.46 | 9 |
| 11. | గుజరాత్ | 43.70 | 53.79 | 11 |
| 12. | నాగాలాండ్ | 42.57 | 27.40 | 19 |
| 13. | హిమాచలప్రదేశ్ | 42.48 | 31.96 | 15 |
| 14. | త్రిపుర | 42.12 | 30.96 | 17 |
| 15. | మణిపూర్ | 41.35 | 32.91 | 14 |

| | | | | |
|---|---|---|---|---|
| 16. | పశ్చిమ బెంగాల్ | 40.94 | 33.20 | 13 |
| 17. | పంజాబ్ | 40.86 | 33.67 | 12 |
| 18. | కర్నాటక | 30.40 | 31.52 | 16 |
| 19. | హర్యానా | 36.14 | 29.89 | 20 |
| 20. | ఒరిస్సా | 34.23 | 26.18 | 21 |
| 21. | మేఘాలయ | 34.08 | 29.49 | 18 |
| 22. | సిక్కిమ్ | 34.05 | 17.74 | 28 |
| 23. | ఆంధ్రప్రదేశ్ | 29.94 | 24.57 | 22 |
| 24. | మధ్యప్రదేశ్ | 27.87 | 22.14 | 23 |
| 25. | ఉత్తరప్రదేశ్ | 27.16. | 21.70 | 24 |
| 26. | జమ్మూ, కాశ్మీర్ | 26.67 | 18.58 | 27 |
| 27. | దాద్రా, నాగర్‌హవేలి | 26.66 | 14.97 | 29 |
| 28. | బీహార్ | 26.20 | 19.94 | 25 |
| 29. | రాజస్థాన్ | 24.38 | 19.07 | 26 |
| 30. | అరుణాచలప్రదేశ్ | 20.76 | 11.29 | 30 |

గమనిక: - 1981లో అస్సాం పరిస్థితి బాగాలేదు గనుక జనాభా లెక్కల సేకరణ జరగలేదు. దీన్నిబట్టి భారతదేశంలో అక్షరాస్యతలో 23వ స్థానంలో ఉండడం తలవంపులు తెచ్చే సమస్యే. ఈ విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు, ఆంధ్ర ప్రజ తీవ్రంగా ఆలోచించవలసి ఉంది మరి.

జనాభా, ఇత్యాది వివరాలు :

భారతదేశంలోనూ, ఆంధ్రప్రదేశ్‌లోనూ జనాభా, విద్యాశాతం ఇత్యాది వివరాలు తెలుసుకుందాం.

| వ.నెం. | వివరాలు | భారతదేశం | ఆంధ్రప్రదేశ్ |
|---|---|---|---|
| 1. | విస్తీర్ణం | 3280483 చ.కి.మీ | 276.7 చ.కి.మీ |
| 2. | జనాభా | 68.5 కోట్లు | 5.38 కోట్లు |
| 3. | పురుషులు | | 2.70 కోట్లు |
| 4. | స్త్రీలు | | 2.68 కోట్లు |
| 5. | గ్రామీణ జనాభా | 46.5 కోట్లు | 3.51 కోట్లు |
| 6. | నగర జనాభా | 22 కోట్లు | 0.84 కోట్లు |
| 7. | షెడ్యూల్డు కులాల జనాభా | 10.5 కోట్లు | 0.57 కోట్లు |
| 8. | షెడ్యూలు తెగలు జనాభా | 8.4 కోట్లు | 0.16 కోట్లు |
| 9. | జనాభా సాంద్రత | 216 చ॥కి.మీ. | 194 ప్రతి కి.మీ. |
| 10. | విద్యాశాతం | 36.2 శాతం | 29.94 శాతం |
| 11. | పురుషులు | 46.9 శాతం | 39.13 శాతం |
| 12. | స్త్రీలు | 24.8 శాతం | 20.52 శాతం |
| 13. | జిల్లాలు | 397 | 23 |
| 14. | 15-35 వయసు జనాభా | 11 కోట్లు | 1.17 కోట్లు |

ఆంధ్ర ప్రదేశ్ పరిస్థితి :

అవిభక్త మద్రాసు రాష్ట్రంలో చిరకాలంగా ఆంధ్రుల తాలూకు 12 జిల్లాలు ఉండేవి. 1953లో బళ్ళారి, కర్నాటకలో కలిపి మిగిలిన 11 జిల్లాలతో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. తదుపరి భాషా ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రలోని 11 జిల్లాలకు తోడు తెలంగాణాలోని 9 జిల్లాలు చేర్చి 1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఆ తర్వాత ఈ 20 జిల్లాలలో కొన్ని వెనుకబడిన తాలూకాలను చేర్చి మరో మూడు జిల్లాలు వెలిశాయి. ఆంధ్రప్రదేశ్‌లో నేడు జిల్లాలు 23. ఈ 23 జిల్లాలలో కలిపి అక్షరాస్యతా శాతం 29.94 మాత్రమే ఇది భారతదేశంలో 23వ స్థానం.

ఆంధ్రప్రదేశ్‌లోని జిల్లాలలోని విద్యావంతుల శాతం పట్టిక :

| జిల్లా పేరు | జిల్లాలో అక్షరాస్యతా శాతం | జిల్లాలో షెడ్యూలు కులాలు అక్షరాస్యతా శాతం | జిల్లాలో షెడ్యూలు జాతుల అక్షరాస్యతాశాతం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | 22.72 | 15.65 | 9.63 |
| విజయనగరం | 21.74 | 15.17 | 7.98 |
| విశాఖపట్నం | 27.83 | 24.82 | 6.28 |
| తూర్పు గోదావరి | 35.31 | 24.29 | 12.59 |
| పశ్చిమ గోదావరి | 37.61 | 23.90 | 11.38 |
| కృష్ణా | 41.71 | 28.80 | 14.55 |
| గుంటూరు | 36.06 | 27.40 | 13.64 |
| ప్రకాశం | 29.39 | 21.61 | 14.66 |
| నెల్లూరు | 32.16 | 17.91 | 8.20 |
| కోస్తా ఆంధ్ర | 32.79 | 23.02 | 9.73 |
| కర్నూలు | 28.73 | 17.07 | 14.01 |

| | | | |
|---|---|---|---|
| అనంతపూర్ | 29.02 | 13.18 | 12.21 |
| కడప | 31.11 | 16.28 | 11.06 |
| చిత్తూరు | 31.85 | 16.56 | 8.68 |
| రాయలసీమ | 30.17 | 15.83 | 11.16 |
| రంగారెడ్డి | 29.41 | 15.53 | 7.05 |
| హైద్రాబాద్ | 58.33 | 42.28 | 29.49 |
| నిజామాబాదు | 21.73 | 8.89 | 4.64 |
| మెదక్ | 21.53 | 9.76 | 5.60 |
| మహబూబ్‌నగర్ | 19.42 | 7.35 | 4.31 |
| నల్గొండ | 22.44 | 11.55 | 4.53 |
| వరంగల్ | 23.55 | 12.72 | 5.07 |
| ఖమ్మం | 25.59 | 16.55 | 6.32 |

| జిల్లా పేరు | జిల్లాలో అక్షరాస్యతా శాతం | జిల్లాలో షెడ్యూల్డ్‌కులాలు అక్షరాస్యతాశాతం | జిల్లాలో షెడ్యూల్డ్‌జాతులు అక్షరాస్యతా శాతం |
|---|---|---|---|
| కరీంనగర్ | 21.50 | 10.15 | 5.24 |
| ఆదిలాబాద్ | 18.79 | 9.77 | 6.85 |
| తెలంగాణా | 26.49 | 13.20 | 5.86 |
| ఆంధ్రప్రదేశ్ | 29.94 | 17.65 | 7.82 |
| భారతదేశం | 36.23 | 21.38 | 16.35 |

పెరుగుతున్న నిరక్షరాస్యులు :

భాష ప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక విద్యాభివృద్ధి విషయంలో విశేష శ్రద్ధ చూపింది. ఐనప్పటికీ ఒకవైపు రాష్ట్రంలో అక్షరాస్యుల సంఖ్య పెరుగుతూ ఉన్నా మరో వైపు నిరక్షరాస్యుల సంఖ్య కూడా పెరుగుతూ ఉంది.

| సంవత్సరం | జనాభా కోట్లలో | అక్షరాస్యుల శాతం | అక్షరాస్యులు (కోట్లలో) | నిరక్షరాస్యులు కోట్లలో |
|---|---|---|---|---|
| 1956 | 3.27 | 12.45 | 0.41 | 2.86 |
| 1961 | 3.59 | 21.19 | 0.76 | 2.83 |
| 1971 | 4.35 | 24.57 | 1.07 | 3.28 |
| 1981 | 5.35 | 29.94 | 1.59 | 3.76 |

అంటే మనరాష్ట్రంలో 1956లో 2.86 కోట్లు నిరక్షరాసులుంటే ఇన్ని పథకాలు, ఇంత ఖర్చు పిదప ఈపాతికేళ్ళ కాలంలో 90 లక్షలమంది నిరక్షరాస్యులు పెరిగిపోయారన్నమాట. పెరిగిపోతున్న జనాభా ప్రభుత్వవనరులను తారుమారు చేస్తున్నవి. అందుచేత పెరుగుతున్న జనాభాకు అదుపులేందే — ఏప్రభుత్వం వారికి తగిన జీవన వసతులు, విద్య అందించలేదనేది స్పష్టమైపోయింది.

ఈ పట్టికలు గమనించినట్లయితే ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణా, పశ్చిమగోదావరి, హైదరాబాద్ వంటి జిల్లాలు తృప్తికరమైన స్థితిలో నున్నవి కాని ఆదిలాబాదు, మెహబూబ్‌నగర్, కరీంనగర్ మొదలైన జిల్లాలు ఇంకా వెనుకబడే ఉన్నాయి.

కావున ఆంధ్రప్రదేశ్ అక్షరాస్యత శాతాన్ని పెంచడానికి కనీసం దేశస్థాయికైనా తెచ్చుకోడానికి వెంటనే తగిన జాగ్రత్తలు తీసుకోవలసిన ఆవశ్యకత ఉంది.

వయోజనవిద్య – దాని ప్రాముఖ్యం :

ఈ ఆధునిక కాలంలో విద్య ప్రాముఖ్యాన్ని సరైన విధంగా గుర్తించాలి. నాగరికతకు విద్య తల్లివంటిదని చెప్పారు. ఎందరు అక్షరాస్యులో, దేశం అంత నాగరికమైనదని గ్రహిస్తారు. ఈ ఆధునిక సంఘాలలో జ్ఞానం శక్తికిమూలం. శక్తిసామర్థ్యాలే ముఖ్యమనే రోజులు గతించాయి. ఈదినం సమాజం అభ్యసించే సమాజంగా మారుతోంది. మరీ ముఖ్యంగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో పౌరాధికారం ఆధారంగా ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. ఓటుహక్కును ఆక్షరాస్యులైన పౌరులు మాత్రమే సరైన విధంగా ఉపయోగించుకోగలుగుతారు. ఎన్నిక సమయంలో అభ్యర్థులు చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోకపోతే, ఈ విద్యావంతులైన పౌరులు ప్రభుత్వాన్ని కదిలించగలరు. రద్దుచేయగలరు. వేరే ప్రభుత్వాన్ని ఏర్పరచగలరు. ఆశించిన, అంగీకరించిన సామాజిక పద్ధతులను విద్యావంతులు మాత్రమే వారి పాత్రలను సరైన విధంగా జరిపించగలరు. విశేషంగా పాల్గోనుట ద్వారా, బాధ్యతగా సహకారాలను పూర్తిగా అందించడం ద్వారా దేశం కోరిన విధంగా వారి ధర్మాలను తృప్తికరంగా నెరవేర్చుట ద్వారా జాతీయాభివృద్ధికి వారు సహకరించిన వారౌతారు.

దేశాభివృద్ధికి సంబంధించిన కార్యాలలో ప్రయోజనకరంగా పాల్గొనినట్లైతే ప్రజా ప్రభుత్వమనేది అర్థవంతంగా ఉంటుంది. దేశపరిస్థితి మెరుగుపరచడానికి విద్య వారికి జ్ఞానోదయం కల్గిస్తుంది.

కావున బాల్యంలో పాఠశాల గడపలో కాలుపెట్టుటకు అవకాశం దొరకని లక్షల అభాగ్యులు నివసించే మనదేశంలో తగిన వయోజన విద్యా కార్యక్రమాలను చేపట్టవలసిన అవసరం ఉంది.

తప్పనిసరి ప్రాథమిక విద్యా విధానంలో పాఠశాలలకు హాజరైన కొందరు కొంతకాలం తరువాత బడులకు వెళ్ళుట మాని మరికొంత కాలం తరువాత నిరక్షరాస్యులుగా మారుతారు.

వయోజనవిద్య ప్రాముఖ్యాన్ని వ్యక్తపరచే కొన్ని తత్త్వశాస్త్ర మూలమైన ఆధారాలు:-

1. విద్య ప్రజాప్రభుత్వ తత్త్వశాస్త్రం. విద్యావకాశాలు అందరికీ సమానంగా ఉండాలని కోరుతున్నాయి. సమాజంలోని ఏ తరగతి ఐనా విద్యావకాశం లేకుండా ఉండరాదు. విద్య నార్జించటానికి నిబద్ధ, అనిబద్ధ పద్ధతుల ద్వారా ప్రజలందరికీ విద్యావకాశాలను కల్పించే బాధ్యత ఇప్పటి రాష్ట్ర ప్రభుత్వానిదే.

2. విద్యావిషయాలను మార్చటం ద్వారా పుస్తకజ్ఞానాన్ని సంపాదించుట కన్న విద్య అధికమగును, బాల్యానికి, యౌవనదశకు సంబంధించిన ఒక పద్ధతి కాదు విద్య. పుట్టుకనుండి పుడకలవరకు జీవితాంతం కొనసాగేది విద్యా విధానం. సామాజికంగా సామర్ధ్యం, ఆర్థికంగా ఫలమతం, మనసునందు సమగ్రతా భావం గల వారిగా ప్రజలను మార్చటానికి వృత్తి నైపుణ్యాలను, వైఖరులను అభివృద్ధి పరచడానికి విద్య తోడ్పడుతుంది.

3. విద్య ఒక వైపు సంపాదించు శక్తిని మెరుగుపరచడానికి మరొక వైపు అంతరంగ శక్తి సామర్థ్యాలతో తాము తమ పరిసరాలలో దేశాభివృద్ధి కార్యాలలో పాల్గొనటానికి సహాయపడుతుంది.

శారీరక, మానసిక, సామాజిక, భావప్రేరితంగా మంచి జీవితాన్ని కొనసాగించటానికి తగిన పాత్రలను వహించటానికి విద్య కావలసిన శక్తిని, అంతర్దృష్టిని ప్రసాదిస్తుంది.

కావున వయోజనవిద్య అవసరమే. ప్రతిఇంటా జ్ఞాన దీపాన్ని వెలిగించటానికి ప్రభుత్వ, ప్రభుత్వేతరమైన అన్నిరకాల సంస్థలు జాతీయ, అంతర్జాతీయ వనరులను సమీకరించాలి.

# వయోజన విద్యాభివృద్ధి చరిత్ర

**వయోజన విద్యాభివృద్ధి చరిత్రను మనం పరిశీలించి చూద్దాం.**

1. వయోజన అక్షరాస్యత :

ప్రపథమంగా ఈ కార్యక్రమాలను వయోజన అక్షరాస్యత అని పిలిచారు. ఎందుకనగా నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా మార్చడమే ఈ కార్యక్రమ ధ్యేయం. ఆది కనీస గమ్యమై ఉండేది. సాంస్కృతిక, సామాజిక వారసత్వాన్ని అవగాహన చేసుకోడానికి జాతీయ కార్యాలలో తగిన భాగస్వామ్యం వహించడానికి ఏ నాగరికునకైనా అక్షరాస్యత అవసరమే.

2. వయోజన విద్య :

తరువాతా '3R' లను మించిన విశేషమైన విద్యనుద్దేశించి ''వయోజన విద్య'' అనే పదం వెల్లడైంది. వెంటనే విశాలమైన పాఠ్య ప్రణాళిక బోధనా కార్యక్రమాలు తయారు చేశాక అమలు పరచారు. వయోజన విద్య అనేది అభ్యసించు వయోజనులకు సంపూర్ణ మూర్తిత్వం పెంపొందించుట, వారికి వీలుపడు సమయంలో విద్యనందించడం కాగలదు.

3. సామాజిక విద్య :

ఈ సామాజిక విద్య వయోజన విద్య కన్న విశాలమైన దృక్పథం కల్గినది. ఇది సామాజిక అభ్యసనయేగాక సామాజిక వృత్తి నైపుణ్యాలను కూడ పెంచుతుంది. సామాజిక విద్య అంటే —

''సమస్యలకు నిబంధనలు పరిష్కారమార్గాలుగల సంఘ వయోజనులను ఉత్సాహకరంగా పాల్గొనేట్లు సంఘ సహకారం ద్వారా చేయగల్గిన సమాజాభివృద్ధి విధానం.''

4. సంఘ విద్య:

సంఘ విద్య సామాజిక, విద్యకన్న ఇంకా విశాలమైనది. ఇందు కొందరిని విద్యావంతులను చేయడమేకాదు కాని విద్యాభివృద్ధి లేని సంఘాలను మొత్తంగా

విద్యావంతులను చేయడం సంఘంలో కావలసిన సామాజిక, ఆర్థిక మార్పులను తేవడం సంఘ విద్య ప్రథమ అవసరం.

5. అభివృద్ధికి సంబంధించిన వృత్తి విద్య :

ఇది ఒక కొత్త పద్ధతి. సాధారణమైన విద్యతో వృత్తి విద్యను చేర్చినట్లైతే నిజమైన అభివృద్ధికి దోహదపడుతుంది. సంఘ సభ్యులందరు అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొంటే దేశాభివృద్ధిని సాధించగలం.

6. అనియత విద్య :

వయోజన విద్యకు ఇది సరికొత్త పద్ధతి. ప్రతి దేశంలో ఒక యువకుని పనిచేసే శక్తిగా భావిస్తారు. నియత విద్య యువకుల అవసరాలను తీర్చటం లేదని తెలిసింది. కావున ఐదో పంచవర్ష ప్రణాళికలో నియత, అనియత విద్యా విధానాలను మిళితం చేయవలెనని ఉద్దేశించారు. అనియత విద్య జీవిత కేంద్రీకరణకే గాక పరిసర జ్ఞానానికి, అభివృద్ధికి సంబంధించినది. అభ్యాసకుల వృత్తినైపుణ్యాన్ని సంపాదించు సామర్థ్యాన్ని అభివృద్ధిపరచుట ఈ అనియత విద్య ముఖ్యోద్దేశం. దీనిని తీరిక సమయంలో నేర్పవచ్చు. ఇది అభ్యాసకుల అవసరాలకు ప్రాముఖ్యాన్నిస్తుంది.

**వయోజన విద్య గతావలోకనం :**

చారిత్రక పునర్విమర్శన :

మన దేశంలో బ్రిటిషు పరిపాలన రాకముందు ఉన్న విద్యా విధానంలో కేవలం సాంఘిక, ఆర్థిక పరిస్థితుల పట్టికను, కాల పట్టికలను మాత్రం నేర్చుకొనేవారు. తరువాత బ్రిటీషు పరిపాలన ఏర్పడ్డాక కొత్త వత్తిడుల వలన అసమానత ఏర్పడింది. జనాభా పెరుగుదల, నిరుద్యోగ సమస్య, సామాజిక ఆర్థిక విలువలు క్షీణించిపోవడం వలన భారతదేశంలోని ఆర్థిక పరిస్థితిలో మార్పు వచ్చింది. 19వ శతాబ్దం చివరిలో కొందరు లోకోపకారులు సామాన్య మానవుని శ్రమల నుండి బాధానివారణ చేయడానికి తగిన ప్రయత్నాలు చేశారు. క్రైస్తవ మిషనరీలు, భారత దేశోద్ధారకులు, రాజకీయ నాయకులు బలహీన వర్గాలకు అట్టడుగునున్న వర్గాలకు విద్యనందిస్తూ తదితర సంఘ సేవలను చేపట్టారు.

# భారతదేశంలో వయోజనవిద్య ఉద్యమం

భారతదేశంలో వయోజన విద్య ఉద్యమం ప్రగతిని నాలుగు దశలుగా విభజించుకోవచ్చు.

మొదటి దశ (1875-1920)

సమాజాన్ని ఉద్ధరించే దశ : ఈ దశలో వయోజన విద్య కేవలం సామాజికోద్ధరణకు సంబంధించి ఉండేది. సామాజికోద్ధరణ ఉద్యమంగా వయోజన విద్య ప్రారంభించారు. తరువాత ఇది రాజకీయ ఉద్యమంగా మారింది. ముఖ్యంగా భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభించిన తరువాత, ఈ ఉద్యమం అక్షరాస్యత తరగతులుగా, గ్రంథాలయాలుగా, పఠన మందిరాలుగా రూపుదిద్దుకున్నవి. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలను అక్షరాస్యత కార్యాలను ప్రారంభించిన ఘనత భారతదేశంలోని క్రైస్తవ మిషనరీలకే దక్కింది. తరువాత బ్రహ్మ సమాజం (1828), ప్రార్థనా సమాజం (1864), ఆర్య సమాజం (1875), రామకృష్ణ మిషన్ (1897) తదితర సామాజికోద్ధరణ ఉద్యమాలు మనదేశంలోని వివిధ భాగాలలోని ప్రజల సామాజికోద్ధరణ, ఆత్మీయ పునరుద్ధరణను సాగించుటకు గురి చూచినవి.

ఈ కాలంలో వయోజన విద్యా కార్యక్రమాలను చేపట్టిన సంస్థల పేర్లు :

1. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ (1905)
2. బాంబేలోని సేవాసదన్ (1908)
3. మద్రాసులో వెనుకబడిన తరగతుల సంఘం (1909)
4. బాంబేలోని సోషల్ సర్వీస్ లీగ్ (1911)

రెండో దశ (1920-1939)

సామూహిక ఉద్యమాలు జరిగిన కాలం: భారత జాతీయ కాంగ్రెస్ స్థాపించాక వచ్చిన రాజకీయ ఉద్యమాలు ప్రజలలో రాజకీయ విజ్ఞానాన్ని కలిగించడానికి అక్షరాస్యత, వయోజన విద్యా కార్యక్రమాలకు సహాయపడ్డాయి.

సహాయ నిరాకరణోద్యమం (1920)

తరువాత రాజకీయ కార్యాలకు బదులు ఉపయోగకరమైన చేతిపనులకు మహాత్మాగాంధీగారు మార్చినారు. అందు వయోజన విద్యా కార్యక్రమం గూడ ఒకటి. Civil disobedient movement (1930)లో కొన్ని సంవత్సరాల వరకు ఈ కార్యక్రమాలు వెనుకబడిపోయాయి. 1927లో, 1937లో వయోజన విద్య ఉద్యమం ఉన్నతమైన స్థితికి చేరింది. రాజకీయ విద్యకు వేసవి బడులు, అక్షరాస్యత బడులు, గ్రంథాలయాలను నిర్వహించు శిబిరాలవంటి ఉపయోగమగు కార్యక్రమాల ద్వారా ఈ వయోజన విద్యా కార్యక్రమాలు జరిగాయి.

స్వాతంత్ర్య పోరాటం, గ్రామీణ పునరుద్ధరణ, కర్షకుల, కార్మికుల సమస్యలు, సోషలిజం ముఖ్య ఉద్దేశాలు గాంధీయిజం మొదలైనవి రాజకీయ విద్యకు సంబంధించినవి.

ఈ కాలంలోని కొన్ని ముఖ్య కార్యాలు :

1. నిర్మాణ కార్యక్రమం ద్వారా వయోజన విద్యను వృద్ధిచేయడానికి వార్ధా సమీపంలోని గాంధీగారి సేవాగ్రామ్ కృషి చేసింది.

2. 1922లో గ్రామీణ పునరుద్ధరణకు శ్రీనికేతన్‌లో డా॥ రవీంద్రనాథ్ ఠాకూర్ గారి సంస్థ ''లోక్ శిక్షా సంసద్'' కరస్పాండెన్స్ కోర్సులు ద్వారా నిరంతర విద్యా శిక్షణలో కృషి చేసింది.

3. 1925లో సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ వయోజన విద్యా కేంద్రాలు నిర్వహించింది.

4. పంజాబ్‌లోని పీపుల్సు సొసైటీ కిసాన్ విద్యాలయాలను 1936లో అమృతసర్‌లోనూ, లాహోర్‌లోనూ నిర్వహించారు.

5. అఖిల భారత సోషలిస్టు పార్టీ పాఠశాల బీహార్‌లోని సోనేపేట్‌లో ఉండేది.

6. 1935లో మద్రాసు కాంగ్రెసు కమిటి వేసవి శిబిరం. ఈ విధంగా ఎన్నో జాతీయ పాఠశాలలు, కళాశాలలు దేశమంతటా స్థాపింపబడటం వలన జాతీయ ఉద్యమం కూడ వయోజన విద్యా కార్యక్రమాల యందు ఆసక్తి చూపింది.

బ్రిటిష్ ప్రభుత్వం 1934లో అక్షరాస్యులకే ఓటు అనే విధానం ప్రకటించినపుడు వయోజన విద్యా ఉద్యమానికి ముప్పు వచ్చింది. 1937లో వివిధ మండలాలలో కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పడిన వెంటనే సామూహిక వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహించారు. వివిధ మాండలిక ప్రభుత్వాలు ఈ విషయంలో తీసుకున్న చర్యలు —

1. మొట్టమొదటిసారిగా బడ్జెట్‌లో పంజాబ్ ప్రభుత్వం వయోజన విద్యకు స్థానం కల్పించింది.

2. కార్మికుల కొరకు రాత్రి పాఠశాలలను అభివృద్ధి చేయడం పురపాలక సంఘాలకు ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం సబ్సిడీలను ఇచ్చింది. విద్యా విస్థరణ విభాగం కూడా 1939లో ఏర్పడింది.

3. గ్రాంటులు అందుకోడానికి రాత్రిబడులకు ప్రభుత్వం గుర్తింపు నిచ్చు జాగును 19.....4లో తిరువనంతపురం ప్రభుత్వం నియమించింది.

4. స్థానిక సమూహిక అక్షరాస్యత కమిటీని బీహారులో నిర్వహించారు.

5. బెంగాలులో రాత్రిబడులు గ్రామీణ పునరుద్ధరణశాఖ వారిచే నిర్వహించారు.

6. అక్షరాస్యత శిబిరాలను ప్రారంభించడానికి బాంబే ప్రభుత్వం ఎస్.ఆర్. భగత్ గారి అధ్యక్షతన వయోజన విద్యకు ఒక సలహా బోర్డును ఏర్పరచినది.

7. 1939లో ఒరిస్సాలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన నిపుణుడైన డా॥ఫ్రాంక్ లాబాక్ గారి ప్రోత్సాహం వలన సామూహిక ఆక్షరాస్యత కమిటి ఏర్పడింది.

8. మైసూర్ రాష్ట్రంలో సంఘసేవ కమిటీని విశ్వవిద్యాలయ యూనియన్ ఏర్పరచినది.

9. హైద్రాబాద్ రాష్ట్రంలో 1944-45లో బడ్జెట్‌లో భాగమిచ్చుట ద్వారా ప్రభుత్వం వయోజన విద్యకు ఆసక్తి చూపుట ప్రారంభించింది.

10. లోగడ హైద్రాబాద్ రాష్ట్రం, కొన్ని సంస్థల ద్వారా వయోజన విద్యాప్రసారం చేసింది. అవి -

1. ఇండియన్ కాన్ఫరెన్సు ఆఫ్ సోషల్ వర్క్,

2. ఆంధ్ర సారస్వత పరిషత్

3. హిందీ ప్రచారసభ,

4. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘం,

5. అఖిల భారతీయ మహిళాసంఘం, తదితరాలు.

మూడోదశ [1939-1947]

వయోజన విద్య ప్రచారకాలం: 1988లో కాంగ్రెస్ మంత్రివర్గం రాజీనామా చేశాక వయోజన విద్య ఉద్యమం మందగించింది. ఐనప్పటికిని ఇదారా తాలిమ్ - ఓ- తరఖీ- జామియా మిల్లా మైసూరు పట్టణంలోని అక్షరాస్యతామండలి, బాంబే పట్టణం వయోజన విద్యాకమిటీలు మొదలైన సంస్థలు ఈ కార్యక్రమాలను కొనసాగించారు.

ఈకాలంలో, వయోజన విద్యకు సంబంధించిన కార్యక్రమాలు దేశమంతటా అభివృద్ధి చేయడానికి, అభిల భారత వయోజన విద్యా సంఘం రాష్ట్ర సంఘాలు ఏర్పడ్డాయి.

విశ్వవిద్యాలయాల సంఘాలు, కళాశాలలు, ప్రాథమిక ఉన్నత పాఠశాలలు, ట్రైనింగ్ సూళ్ళు ఈ కాలంలో వయోజన విద్య ఉద్యమానికి సహాయపడ్డాయి.

నాలెగో దశ : [1947-1976]

సామాజిక విద్యాదశ : స్వాతంత్ర్యాన్ని సంపాదించిన తరువాత, నిర్బంధ ప్రాథమిక విద్య ముఖ్యమైన విద్యా పాలసీలలో ఒకటి. ప్రజా ప్రభుత్వమే ఒక ప్రభుత్వంగా ఎంచబడిన తరువాత, ప్రజలకు విద్యాభివృద్ధి కార్యక్రమాలలో ఇంకా తమ్ము తామే క్రమశిక్షణలో నుంచుకోడానికి సహాయ పడింది.

జాతీయాభివృద్ధి ప్రణాళిక ఏర్పడిన వెంటనే సంఘాభివృద్ధి పథకాలలో కార్యక్రమాలలో సామాజిక విద్య ముఖ్యమైన అంశంగా మారింది. ఈ విధంగా వయోజన విద్య కేంద్రం రాష్ట్ర ప్రభుత్వాలచే గుర్తింపు పొందింది. ప్రతి

సంఘాభివృద్ధికి బ్లాకులో ప్రజల విద్యను అభివృద్ధి చేయడానికి సామాజిక విద్యా అధికారిని నియమించిరి.

ఆంధ్రప్రదేశ్‌లోని వయోజన విద్య చరిత్రలో చెప్పుకోదగ్గ విషయాలు :

స్వాతంత్ర్యాన్ని సంపాదించక ముందు ఆంధ్రప్రదేశ్‌లోని వయోజన విద్యలోని చెప్పుకోదగిన విషయాలు :

1. 1848లో గుంటూరులోని ఆంధ్ర ఇవాంజిలికల్ చర్చి వారి అక్షరాస్యతా సేవ.

2. 1929లో తాడేప ల్లిగూడెంలో 1931లో రాజమండ్రి లో శనివారపు సుబ్బారావు గారి గ్రామీణ పునర్నిర్మాణ తరగతులు

3. 1995లో నిడుబ్రోలులో ఆంధ్ర రైతాంగ విద్యాలయం

4. 1936లో పశ్చిమ గోదావరి జిల్లాలో గ్రామ పునర్నిర్మాణ తరగతులు ఆంధ్ర రైతు సంఘం వారు నిర్వహించారు.

5. ఆంధ్ర సోషలిస్టు పార్టీ వారిచే కొత్తపాలెంలో వేసవి బడులు నిర్వహించబడ్డాయి.

6. 1935లో మద్రాసులో సాంబమూర్తిగారిచే వేసవి బడులు నిర్వహించబడ్డాయి.

7. పూర్వం హైదరాబాద్ రాష్ట్రంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు అక్షరాస్యతా తరగతులు, ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం నిర్వహించిన తరగతులు.

8. సర్కారుల అఖిల భారత విద్యా ఫెడరేషన్ నిర్వహించిన వయోజన విద్యా తరగతులు,

9. మద్రాసు ప్రభుత్వ ఉద్యోగులైన దిన పాఠశాలల ఉపాధ్యాయులచే రాత్రి బడులను నడిపించారు.

10. మద్రాసులో నగర విద్యా సంఘాలు వయోజన పాఠశాలలను నడిపించారు.

11. అవిభక్త మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్ర విభాగంలో గాడిచెర్ల హరిసర్వోత్తమరావు గారిచే వయోజన విద్యా పాఠశాలలు నిర్వహించారు.

12. వ్యక్తిగతంగా స్వచ్ఛంద సంస్థల ద్వారా వయోజన పాఠశాలలు నిర్వహించారు.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన రాష్ట్రంలో వయోజన విద్యా కార్యక్రమంలో జరిగిన అభివృద్ధి

**1. 1949** తరువాత మద్రాసు రాష్ట్రం, ఒకటి లేక అనేక వయోజన విద్యా కేంద్రాలను, ప్రతి భాషా విభాగాలను ఒకటి లేక రెండు వయోజన వేత్తలకు శిక్షణ కేంద్రాలను ప్రతి గ్రామంలో నెలకొల్పాలని చెప్పింది. వేరుగా మేనేజిమెంటులు వయోజన విద్యా కేంద్రాలను ప్రారంభించి జిల్లా విద్యాధికారి నుండి గ్రాంటును పొందాయి. ఉప పర్యవేక్షణాధికారిచే తనిఖీ చేయబడ్డాయి.

**2. 1950**లో గాడిచర్ల హరిసర్వోత్తమరావు గాగు వయోజన విద్యకు గౌరవ సంచాలకులుగా పనిచేశారు. ఆంధ్రదేశం వయోజన విద్యా విభాగంలో ఆయనను ఘనునిగా భావించారు. 1958 వరకు ఈ కేంద్రాలు కొనసాగాయి కాని అప్పటి మంత్రివర్గం వలన వయోజన విద్యా కేంద్రాలు పూర్తిగా నశించిపోయాయి.

3. తెలంగాణాలో కోదాటి నారాయణరావు తదితరులు వయోజన విద్య అక్షరాస్యత కేంద్రాలను నిర్వహించుటకు గ్రంథాలయ "ఉద్యమానికి'' ఉపయోగించుకొన్నారు.

4. రాష్ట్రంలో సంఘాభివృద్ధి బ్లాకులను స్థాపించడం వలన సామాజిక విద్య వెలుగులోనికి వచ్చింది. ప్రతి బ్లాకులో సామాజిక విద్యాధికారిని నియమించారు. ఈయన గ్రామీణ స్థాయిలో ఉన్న కార్యకర్తల సహాయంతో పనిచేస్తారు.

5. పూర్వం హైదరాబాదు రాష్ట్రంలో వయోజన విద్యకు సలహాదారునిగా పనిచేసిన డి.ఎల్. ఆనందరావు గారు సామాజిక విద్యపై మూడు సంవత్సరాలకు సరిపడు కార్యక్రమాలను విశదీకరిస్తూ ఒక నివేదికను సమర్పించారు.

6. 1963 తరువాత రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే ఆర్థిక సహాయంతో ప్రతి పంచాయతీ సమితి సుమారు పది వయోజన విద్యా కేంద్రాలను నిర్వహిస్తున్నారు.

7. రెండు వయోజన విద్యావేత్తల శిక్షణా కేంద్రాలను విజయవాడ (పటమట) జెడ్‌చర్ల వద్ద వయోజన విద్యావేత్తలకు శిక్షణ నిచ్చుటకు ప్రారంభించారు.

**8. 1970**లో వయోజన విద్య కొనసాగే వయోజన విద్యా విభాగాలు ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో ఏర్పరచారు.

9. రైతుల ముఖ్య అక్షరాస్యత కార్యక్రమాలను వ్యవసాయ విభాగం హైదరాబాదులోని ఆంధ్ర మహిళా సభవారు ఏర్పరచారు.

10. విశ్వవిద్యాలయాలలో జాతీయ సేవా పథకాలు ప్రవేశ పెట్టడం ద్వార వివిధ విశ్వవిద్యాలయాలలోని విద్యార్థులు వయోజన విద్య కార్యాలను వారి కార్యక్రమాలలో ఒక భాగంగా నిర్వహించారు.

11. 1975లో 15 నుండి 25 సంవత్సరాల వయస్సు గల వారిని ఎన్నిక చేసి కొన్ని జిల్లాలలో కేంద్రప్రభుత్వ ప్రేరణతో విద్యావిభాగంవారు అనియత విద్యాకేంద్రాలను ప్రారంభించారు.

12. ఇప్పుడు సామాజిక సంక్షేమ విభాగం, గిరిజన సంక్షేమ విభాగం, మహిళా సంక్షేను విభాగాలు కొన్ని స్థలాలలో వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు.

13. అక్షరాస్యత కార్యక్రమాలకు కావలసిన పుస్తకాలను అందించడానికి ఆంధ్ర మహిళా సభలో సాక్షరతా భవన్ స్థాపించారు.

14. 1976 డిసెంబరు నెలలో అనియత విద్య ముఖ్య అక్షరాస్యత కార్యక్రమాలకు ప్రత్యేక ఆఫీసర్ ఉద్యోగాన్ని సృష్టించారు.

15. 1977లో కేంద్ర సహాయంతో శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో అనియత విద్యకు వనరుల కేంద్రాన్ని స్థాపించారు.

16. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లోని రాష్ట్ర విద్య పరిశోధన శిక్షణ మండలి అనియత విద్యా కార్యక్రమాల తాలూకు అకడమిక్ అంశాలన్నీ చూస్తున్నారు.

17. సాంఘిక విద్యా సంచాలకులు మొదటి స్థాయిలో సున్న అధికారి ముఖ్య అక్షరాస్యత కార్యక్రమాల నిర్వాహక విషయాలను చూస్తున్నారు.

18. 1977లో ఆంధ్రప్రదేశ్ వయోజన విద్యా సంఘం అప్పటి విద్యామంత్రిగారి అధ్యక్షతలో ఏర్పడింది. రాష్ట్ర వయోజన విద్యా సంస్థలు కూడా ఏర్పడ్డాయి.

19. అనియత విద్య ముఖ్య అక్షరాస్యత కార్యక్రమాలకు సమన్వయ సంఘాలు రాష్ట్ర స్థాయిలో ఏర్పడ్డాయి.

దీనిని బట్టి వయోజన విద్యను అభివృద్ధి చేయడానికి ఆంధ్రప్రదేశ్‌లో ప్రయత్నాలు చాలా బలహీనంగా ఉన్నాయని చెప్పవచ్చు. వీటిని శక్తివంతం చేయడానికి కృషి చేయాలి. దీనిని సాధించాలంటే పాఠశాలలకు వివిధ కారణాల వలన హాజరు కాలేనివారికి అనేకులను విద్యావంతులుగా చేయాలంటే వయోజన విద్య ప్రచారంలో సామూహిక కార్యక్రమాలను చేపట్టవలసి ఉంది.

వయోజన విద్య ప్రగతి :

కేంద్రంలో జనతా ప్రభుత్వం ఏర్పడిన తరువాత వయోజన విద్యా కార్యక్రమాలకు చాలా శ్రద్ధ చూపారు. దేశంలో అక్షరాస్యత స్థితి క్షీణించినట్లు ప్రభుత్వమూహించింది. 1977లో అంచనా వేసిన నిరక్షరాస్యుల సంఖ్య 22.65 కోట్లు. అక్షరాస్యత శాతం 38. నిర్బంధ ప్రాథమిక విద్య, వయోజన విద్యలకు ప్రాముఖ్యత నివ్వాలని విద్యామంత్రి పి.సి. చందర్ గారు పార్లమెంట్‌లో చెప్పారు. అనేక మంది విద్యావేత్తలు వయోజన విద్యా విభాగంలో పనిచేసేవారు అనేక చర్చలు జరిపిన తరువాత 1977 జూన్ నెలలో వయోజన విద్యపై ఒక ముసాయిదా ప్రకటన తయారైంది. 1977 అక్టోబరు నెల 8 నుండి 10 తారీఖులలో ఉదయపూర్‌లో వయోజన విద్యా గోష్ఠిలో కూడా ఈ అంశం చర్చించారు. తుదకు ఒక విధాన ప్రకటన వయోజనవిద్యపై వెలువడింది.

1977 అక్టోబరులో విద్యా సాంఘిక సంక్షేమ మంత్రిత్వ శాఖ జాతీయ వయోజన విద్యా కార్యక్రమంపై ముఖ్య విషయాలను తయారుచేశారు.

జాతీయ వయోజన విద్యా బోర్డు ఏర్పడింది. ఈ బోర్డు తొలి సమావేశం 1977 నవంబరు నెలలో జరిగింది. జాతీయ వయోజన విద్యా కార్యక్రమాన్ని విపులంగా ఈ సమావేశంలో చర్చించారు.

వయోజన విద్య : విధాన ప్రకటన

జాతీయ వయోజన విద్యా కార్యక్రమంపై కేంద్ర ప్రభుత్వ విధాన ప్రకటన ఈ విధంగా వివరిస్తున్నది. ''14 సంవత్సరాల వయస్సు వరకు సార్వజనిక విద్యను ఇవ్వడానికి కృషిచేస్తుండగా, వయోజన జనాభాకు విద్య పెంపొందించుకొనుటకు వారి సామర్థ్యాలను అభివృద్ధి చేసుకోడానికి విద్యా సదుపాయాలు మెరుగు పరుస్తారు.''

కాబట్టి ప్రభుత్వం "సామాజిక సాంస్కృతిక మార్పులను తేవడం ప్రజలు ఉత్సాహంగా పాల్గొనేటట్లు చేయడం నిరక్షరాస్యతతో సరియైన ప్రణాళికతో కఠినమైన పోరాటాన్ని జరపాలని నిశ్చయించింది''. పై వాక్యాల ప్రకారం వయోజన విద్య వీటిపై ఆధారపడి ఉంది.

(అ) వ్యక్తిగత దేశ సామాజిక ఆర్థిక ఎదుగుదలకు ఈ నిరక్షరాస్యత ఒక ముఖ్య సమస్య.

(ఆ) విద్య పాఠశాల చదువుతోనే ముగియదు. కాని చేసే పని జీవిత పరిస్థితులలో ఎల్లప్పుడు ఉపయోగపడుతుంది.

(ఇ) అభ్యసన, పని జీవనం విడదీయలేనివి. ఒకదానితో ఒకటి పరస్పర సంబంధం కలిగి ఉన్నప్పుడే అవి అర్థవంతంగా ఉంటాయి.

(ఈ) నిరక్షరాస్యులు, పేదలు అక్షరాస్యత, సంభాషణ ప్రవర్తన ద్వారా వారు స్వేచ్ఛను అనుభవించవచ్చు.

కాబట్టి వయోజన విద్య సమాజంలో ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన వారికి అక్షరాస్యత నైపుణ్యాన్ని నేర్పడంలో శ్రద్ధ చూపాలి. ప్రేరణ, అభ్యసనకు జీవన పరిస్థితులకు గల సంబంధం, ప్రసార సాధనాలు ఉపయోగించడం, ముఖ్య సామర్థ్యాలను పెంపొందించడం, అభివృద్ధి అవసరాలను మొదలైన వాటియందు కూడ శ్రద్ధ వహించాలి.

విధాన ప్రకటన ప్రకారం, వయోజన విద్యా కార్యక్రమాలు అభ్యసించేవారి అవసరాలు పరిసరాలకు సరిపడేవిగా ఉండాలి. సమయం, స్థలం, బోధనకు సరైన

ఏర్పాట్లు మొదలైనవి అనుకూలంగా ఉండాలి. పాఠ్యప్రణాళిక, బోధన, బోధనా పరికరణాలు వివిధ రకాలుగా ఉండాలి. అన్ని నిర్వాహక విషయాలలో క్రమశిక్షణ అవసరం.

నిరక్షరాస్యులకు ప్రాముఖ్యాన్ని ఇవ్వాలని విధాన ప్రకటన ఉద్దేశ్యం. జనాభా పెరుగుదల చేసిన అసంపూర్ణమైన ప్రయత్నాల ప్రకారం నిరక్షరాస్యుల సంఖ్య 247 మిలియన్ల (1951) నుండి 309 మిలియన్ల (1971) వరకు ఎదిగింది. వచ్చే 10 సంవత్సరాల లోపు 15-35 వయసుగల వారందరికీ పెద్ద కార్యక్రమాన్ని ప్రారంభించాలని తలంచారు.

''పెద్ద కార్యక్రమాలను నిర్వహించడానికి సరిపడు ఆర్థిక నిర్వాహక మద్ధతులు చాల అవసరం'' ఇది విధాన ప్రకటన సలహా.

విధాన ప్రకటన ప్రకారం ఈ క్రింది ముఖ్య విషయాలను గమనించాలి. పట్టణ కార్మికులు, ప్రభుత్వ ముఖ్య ఉద్యోగులు, వ్యాపార స్థాపనల ఉద్యోగులు, గృహిణులకు బోధించాలి. తరగతి అంతా పాల్గొనుట, కరస్పాండెన్స్ కోర్సులు లేక ఈ రెండింటికి మిశ్రమ పద్దతులు కూడ ఉపయోగపడవచ్చును.

ముగింపులో ముఖ్య విషయం వయోజన విద్యా కార్యక్రమం అమలు జరపడంలో వికేంద్రీకరింపబడింది. చురుకుగా పనిజేసే సహకార సంఘాలను స్థాపించడం కూడ చాల అవసరం. ఇందుకుగాను కేంద్ర ప్రభుత్వం జాతీయ వయోజన విద్యా బోర్డును స్థాపించింది. రాష్ట్రస్థాయిలో, జిల్లా బ్లాకు స్థాయిలలో కూడ ఈ విధమైన బోర్డులను స్థాపించవచ్చును అని విధాన ప్రకటన ముగించింది.

## జాతీయ వయోజన విద్యా కార్యక్రమం

జాతీయ వయోజన విద్యాకార్యక్రమము (National Adult Education Programme) ముఖ్య లక్షణాలు :

1. కార్యక్రమంలో విషయాలు :

1978 అక్టోబరు నెల 2వ తారీఖున జాతీయ వయోజన విద్యా కార్యక్రమం ప్రారంభించారు. ఇప్పటినుండి 1979 మార్చి వరకు పలు ఏర్పాట్లు జరిగాయి. అవి:-

* 1978-79లో ప్రస్తుతం ఉన్న సుమారు 5 లక్షల నుండి 10 లక్షల వరకు ప్రజలకు కార్యక్రమాలను ఏర్పాటు చేయడం.

* జాతీయ వయోజన విద్యా కార్యక్రమం ప్రవేశపెట్టడానికి సరిపడు పరిసరాలను సృష్టించడం.

* ప్రతి రాష్ట్రానికి కేంద్రపాలిత రాష్ట్రాలకీ విపులమైన ప్రణాళికలను తయారు చేయడం.

* కావలసిన సంస్థలను స్థాపించడం.

* వివిధ స్వచ్ఛంద సంస్థల అధికారులను, అనధికారులను గుర్తించడం.

* వివిధ రకాల ఉపయోగపడు బోధన / అభ్యసన ఉపకరణాలను తయారు చేయడం. కార్యక్రమాన్ని ప్రారంభించడం. దానిని అందుబాటులో ఉంచే సామర్థ్యాన్ని ప్రతి రాష్ట్రంలో అభివృద్ధిపరచడం.

* కార్యక్రమాన్ని ప్రారంభించడానికి బోధనా పద్ధతులలో శిక్షణను, శిక్షణకు కావలసిన పుస్తకాల తయారీ, వివిధ స్థాయిలలో శిక్షణ ఇవ్వడం.

* సరియైన మూల్యాంకన విధానాలను పరిశోధనా విభాగాలను ఏర్పరచడం.

కార్యక్రమం సాంవత్సరీక వివరాలు :

| సంవత్సరం | వార్షికంగా అక్షరాస్యులు లక్షలలో | అక్షరాస్యుల సంఖ్య సంచయనం చేయగా (లక్షలలో) |
|---|---|---|
| 1979-80 | 25 | 25 |
| 1980-81 | 40 | 65 |
| 1981-82 | 60 | 125 |
| 1982-83 | 85 | 210 |
| 1983-84 | 110 | 320 |
| 1984-85 | 135 | 455 |
| 1985-86 | 155 | 610 |
| 1986-87 | 170 | 780 |
| 1987-88 | 185 | 965 |
| 1988-89 | 200 | 1165 |

ఈ పది సంవత్సరాలలో అక్షరాస్యుల సంఖ్య 11.65 కోట్లు కావాలని భావించారు.

2. పద్ధతి :

వయోజన విద్యా కార్యక్రమాలు నిర్వహించడానికి వివిధ రకాల కార్యక్రమాలు ఏర్పాటు చేయటం

— తగిన ప్రయత్నాల ద్వారా అక్షరాస్యత.

— సంప్రదాయకమైన క్రియాశీలక విద్య.

— అభివృద్ధి కార్యక్రమానికి మద్దతునిచ్చే ముఖ్య అక్షరాస్యత

— అందరూ కలసి నేర్చుకోవడం.

— సలహాలనిచ్చు అక్షరాస్యత పేదలకు సంస్థలను ఏర్పరచడం.

3. బోధన - అభ్యసనోపకరణాలు :

నిర్ణీత భాషలో, స్థానిక భాషలో బోధనాభ్యసనకు కావలసిన పుస్తకాలను తయారుచేయుటలో వయోజన విద్యా వనరుల కేంద్రం సహాయపడుతుంది.

4. శిక్షణ :

ఈ వర్గాలకు శిక్షణ నివ్వాలి.

— జాతీయ రాష్ట్ర స్థాయిలలో గల ముఖ్య అధికారులకు

— పాఠ్య ప్రణాళిక, బోధనాభ్యసన పుస్తకాలను తయారుచేయు శిక్షణ నిచ్చు, మూల్యాంకన మొదలైన విషయాలలోని నిపుణులకు

— జిల్లా పథక బ్లాకు స్థాయిలలోని ముఖ్యాధికారులకు

— కార్యక్రమ పర్యవేక్షకులకు

— వయోజన విద్యా కేంద్రాలలోని బోధకులకు

5. బోధించుట, మూల్యాంకన పరిశోధన :

జాతీయ వయోజన విద్యా అనుభవాలను క్రమంగా పరిశీలించి తగిన సలహాల నివ్వడానికి బోధన, మూల్యాంకన పరిశోధనలకు సమాచార పత్రికలు చాలా ముఖ్యం.

6. ఏజన్సీలు :

జాతీయ వయోజన విద్యాకార్యక్రమం కొరకు ప్రభుత్వంతో బాధ్యతను పంచుకొనుటకు బోధన ఏర్పాట్లను చేసే సంస్థలకు వివిధ ఏజన్సీలు.

బోధనకు బాధ్యత వహించవలసిన వివిధ వర్గాలు :

అ) ఉపాధ్యాయులు

ఆ) విద్యార్థులు

ఇ) ఉద్యోగులైన గ్రామీణ యువకుల

ఈ) ఉద్యోగం నుండి విరమించుకున్న వారు, మాజీ సైనికులు, ఇతర అధికారులు

ఉ) కార్యక్రమ రంగంలో ప్రభుత్వ ఇతర అధికారులు

ఊ) స్వచ్ఛంద సాంఘిక సేవకులు.

తదుపరి చర్యలు :

సాధారణమైన విద్యను ముగించిన వారికి వయోజన విద్యా కార్యక్రమం ద్వారా నేర్చిన వారికిని తదుపరి చదువు కొనసాగించే ఏర్పాట్లు చాల అవసరం.

ఈ విధమైన తదుపరి కార్యక్రమం NAEPలో ఒక భాగంగా ప్రారంభం నుండే ఆవశ్యకమైనది.

స్వచ్ఛంద సంస్థల పాత్ర :

విధాన ప్రకటన ప్రకారం స్వచ్ఛంద సంస్థలు ఫలభరితంగా ఉండాలంటే వారు ప్రత్యేక పాత్రను వహించాలి. తగిన చర్యలు తీసుకోవాలి. జాతీయ వయోజన విద్యా కార్యక్రమంలో స్వచ్ఛంద సంస్థల పాత్రపై 1977 ఆగష్టు 25, 26 తేదీలలో జరిపిన గోష్ఠిలో ఈ క్రింది వాటికి కొత్త పాలసీని అందించవలసిందిగా భావించారు.

1. పనిచేస్తున్న సంస్థలకు అధిక మద్దతు నివ్వాలి.

2. ఇతర సంస్థలకు మద్దతు నందించుట అనగా ప్రస్తుతం ప్రభుత్వ సహాయంలేని వయోజన విద్యా రంగంలో పనిచేసే సంస్థలకు

3. వయోజన విద్యా రంగంలో ప్రస్తుతం పనిచేయక పోయిన పనిచేయు సాహసం గల సంస్థల సహకారం

4. కొత్త సంస్థలు ఉద్భవించేట్లు పరిస్థితులను మెరుగు పర్చడం గోష్టిలో తీసుకున్న నిర్ణయాలను అమలుపరచడానికి జాతీయ వయోజన విద్యా మండలి అంగీకరించింది.

జాతీయ వయోజన విద్యా కార్యక్రమంలో యువకుల పాత్ర :

జాతీయ వయోజన విద్యా కార్యక్రమంలో ఉత్సాహకరమైన యువకుల పాత్ర చాలా అవసరం. ఇందులో యువకులను పాల్గొనేటట్లు చేయడంలో అనధికారులు, నిపుణులు జాతీయ స్థాయిలో పోటీలను నిర్వహించాలి.

— నెహ్రూ యువక కేంద్రాలు తమ అనియత విద్యా కార్యక్రమాలను చక్కగా నిర్వహించి వయోజన విద్యా కార్యక్రమాలలో జతచేయాలి.

— జాతీయ వయోజన విద్యా కార్యక్రమానికి ఉన్నత స్థాయి ఉండాలంటే జాతీయ స్వచ్ఛంద సేవా పథకానికి గౌరవం ఉండాలి.

— ఉపాధ్యాయుల పనిలో విద్యార్థుల బాధ్యతతో వయోజన విద్యను తప్పనిసరి భాగంగా చేయడం వలన సామాజిక సేవల ద్వార, జాతీయ సేవా పథకంలో తగిన మార్పులు తేవడం వలన సర్టిఫికేటులు లేక ప్రత్యేక ఆసక్తిని చూపిన వారిని గౌరవించడం ద్వార ప్రత్యేక ప్రేరణ నివ్వడం వలన, సంస్థల ద్వారా బహుమానాలు, సామర్థ్యానికి తగిన బహుమానాల నిచ్చుట ద్వార విద్యార్థులను కార్యక్రమంలో పాల్గొనేట్లుట చేయగలం.

# రాష్ట్రంలో కార్యక్రమం

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వయోజన విద్యా కార్యక్రమం ఈ రీతిగా ఉంటుందని ఇటీవల రాష్ట్ర ప్రభుత్వం ఒక కరపత్రంలో ప్రకటించింది.

1978 నాటికి మన రాష్ట్రంలో నిరక్షరాస్యుల సంఖ్య 110 లక్షలుగా అంచనా వేశారు. దీనిలో ఈనాటి వరకు 25 లక్షల మంది అక్షరాస్యులయ్యారు. 1987-88 నాటికి మిగిలిన అక్షరాస్యుల సంఖ్య 85 లక్షలు. 1994-95 నిరక్షరాస్యుల సంఖ్య 95.96 లక్షలకు పెరుగుతుందని అంచనా వేశారు. ఇంతమంది నిరక్షరాస్యులైన వయోజనులను 1994-95 నాటికి అక్షరాస్యులుగా చేయాలంటే భారీ ఎత్తున కార్యక్రమం చేపట్టవలసి ఉంటుంది. ఈ కార్యక్రమంలో స్త్రీలకు, షెడ్యూల్డు కులాలవారికి, షెడ్యూల్డు తెగలవారికి ఎక్కువగా ప్రాముఖ్యత ఇవ్వబడుతుంది.

**కార్యక్రమాన్ని అమలుజరిపే విధానం** :

మన రాష్ట్రంలో ప్రస్తుతం 52 ప్రాజెక్టులు నడుపబడుచున్నవి. దీనిలో 26 కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యాన నడుపబడుచున్నాయి. ఒక ప్రాజెక్టులో సగటున పది మండలాలున్నాయి. ఈ పది మండలాలలో 300 వయోజన విద్యా కేంద్రాలు ఏర్పాటు చేస్తారు. సాధారణంగా ఈ కార్యక్రమాన్ని చేపట్టేముందు గ్రామాల్లో సర్వే జరుపుతారు. ఈ వయోజన విద్యా కేంద్రాలు పర్యవేక్షణకు సులభంగా ఉండే విధంగా ఏర్పాటు చేస్తారు. ఒక కేంద్రాన్ని ఒక కార్యకర్త నడుపుతారు. ఇటువంటి 30 కేంద్రాలను ఒక పర్యవేక్షకుడు పర్యవేక్షిస్తారు. ఒక ప్రాజెక్టుకు ఒక ప్రాజెక్టు అధికారి, ఒక సహాయ ప్రాజెక్టు అధికారి, పది మంది పర్యవేక్షకులు, 300 మంది కార్యకర్తలు ఉంటారు. ఒక సంవత్సరంలో ఒక ప్రాజెక్టు నుండి 900 మంది నిరక్షరాస్యులను (15-35 సంవత్సరముల వయస్సువారిని) అక్షరాస్యులుగా చేయడానికి నిర్ణయించారు. ప్రతి కేంద్రంలోనూ 30 మంది నిరక్షరాస్యులుంటారు. వారికి కావలసిన బోధన సామగ్రి ఇతర పరికరాలను ఉచితంగా సరఫరా చేస్తారు.

వయోజన విద్యా ప్రాజెక్టులు : మన రాష్ట్రంలో నడిపే 52 ప్రాజెక్టుల వివరాలు :

| వరుస సంఖ్య | జిల్లా | ప్రాజెక్టుల సంఖ్య | |
|---|---|---|---|
| | | కేంద్రప్రాజెక్టులు | రాష్ట్రప్రాజెక్టులు |
| (1) | (2) | (3) | (4) |
| 1 | శ్రీకాకుళం | 1 | 2 |
| 2 | విజయనగరం | 1 | 2 |
| 3 | విశాఖపట్టణం | 1 | 1 |
| 4 | తూర్పు గోదావరి జిల్లా | 1 | (షె. తెగల వారికి) |
| 5 | పశ్చిమగోదావరి జిల్లా | 1 | ..... |
| 6 | కృష్ణ | 1 | .... |
| 7 | గుంటూరు | 2 | 1 |
| 8 | ప్రకాశం | 1 | 1 |
| 9 | నెల్లూరు | 1 | 1 |
| 10 | చిత్తూరు | 1 | 2 |
| 11 | అనంతపురం | 1 | 2 |
| 12 | కర్నూలు | 1 | 1 |
| 13 | కడప | 1 | 1 |
| 14 | కరీంనగరు | 2 | 1 |
| 15 | వరంగల్లు | 2 | 1 |
| 16 | ఖమ్మం | 1 | 1 |
| 17 | నిజామాబాదు | 1 | 1 |
| 18 | ఆదిలాబాదు | 1 | 2 |
| 19 | మహబూబ్ నగర్ | 1 | 1 |
| 20 | మెదక్ | 1 | 2 |
| 21 | హైదరాబాదు | 1 | - |
| 22 | రంగారెడ్డి | 1 | 1 |
| 23 | నల్గొండ | 1 | 1 |

కార్యక్రమాలు నిర్వహించే సంస్థలు :

మన రాష్ట్రంలో ఈ దిగువ ఉదహరించిన సంస్థలు నేడు వయోజన విద్యా కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి.

1. గ్రామీణ క్రియాశీలక అక్షరాస్యత పథకాలు (కేంద్ర ప్రభుత్వం)
2. రాష్ట్రప్రభుత్వ వయోజన విద్యా పథకాలు
3. కళాశాలలు, విశ్వవిద్యాలయాల తరపున నిర్వహించే సామూహిక అక్షరాస్యతా కార్యక్రమాలు
4. నెహ్రూ యువక కేంద్రాలు నిర్వహించే కార్యక్రమాలు
5. స్త్రీ శిశు సంక్షేమశాఖ నిర్వహించే సమీకృత శిశు అభివృద్ధి పథకాలు
6. శ్రామిక విద్యా పీఠాలు నిర్వహించే పథకాలు
7. స్వచ్ఛంద సంస్థలు నిర్వహించే పథకాలు.

జాతీయ అక్షరాస్యతా ఉద్యమం :

భారత ప్రభుత్వం నూతన విద్యా విధానంలో ఒక భాగంగా 1988 మే 5వ తేదీన జాతీయ అక్షరాస్యతా ఉద్యమాన్ని (నేషనల్ లిటరసీ మిషన్) ప్రధాని శ్రీ రాజివ్ గాంధి ప్రారంభించారు. ఈ ఉద్యమం మన రాష్ట్రంలో గూడ ప్రారంభమైంది. ఇందు ప్రధానంగా -

"నూతన విద్యా విధానంలో ఈ అక్షరాస్యతా కార్యక్రమం వ్యవస్థీకృతం చేయబడింది. ఈ విధానాన్ని అనుసరించి ఒక్కొక్క ప్రాజెక్టులో 14 నుండి 15 జన శిక్షణాలయాలు ప్రారంభించబడతాయి. ఈ జన శిక్షణా నిలయాలు దాదాపు 5000 జనాభా గల 4-6 గ్రామాల కూడలిలో దీనిని నెల కొల్పుతారు. ఈ జన శిక్షణాలయాలు నూతనంగా అక్షరజ్ఞానం సంపాదించినవారికే గాక ప్రాథమిక స్థాయిలో చదువు ఆపివేసిన వారికి గ్రామంలోనే చదువునందు ఆసక్తి కలిగిన జనులందరికీ ఉచితంగా శిక్షణ ఇచ్చుటయేగాక సాంస్కృతిక కార్యక్రమాలు, వారి

వారి వృత్తులలో నైపుణ్యాన్ని సంపాదించుకోటానికి ఉపయోగపడతాయి. ఈ జన శిక్షణా నిలయాలు సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక సంస్థగా నెలకొల్పబడుతాయి. కేంద్ర ప్రభుత్వమువారు 370 జన శిక్షణా నిలయాలు రాష్ట్ర ప్రభుత్వంవారు 280 జన శిక్షణా నిలయాలు నడుపుటకు కావలసిన నిధులు మంజూరు చేశారు.

ఈ నూతన విద్యా విధానంలో 1994-95 నాటికి రాష్ట్రంలోని 95 లక్షల నిరక్షరాస్యుల (15-35 సంవత్సరాల మధ్య వయస్సు గల) నందరని అక్షరాస్యులుగా చేయుట లక్ష్యంగా సంకల్పించబడింది. ఈ లక్ష్యసాధన ఇప్పుడు ఉన్న 52 ప్రాజెక్టులతో సాధ్యం కాదు. స్వచ్ఛంద సేవా సంస్థలు విరివిగా పాల్గొనవలసియుంది. ఈ కార్యక్రమంలో పాల్గొనే స్వచ్ఛంద సేవా సంస్థలకు అయ్యే ఖర్చులో కేంద్ర ప్రభుత్వం 95 శాతం వరకు భరిస్తారు.

వయోజన విద్యా వనరుల కేంద్రం :

రాష్ట్రంలోని వయోజన విద్యా కార్యక్రమానికి తగిన సాంకేతిక సంపత్తిని అందించేందుకు కేంద్ర ప్రభుత్వం ఆంధ్ర మహిళా సభలోని సాక్షరతా భవన్ లోను, ఉస్మానియా విశ్వ విద్యాలయంలోనూ వయోజన విద్యా వనరుల కేంద్రాలను (స్టేట్ రిసోర్స్ సెంటర్స్) ను ప్రారంభించింది. ఈ కేంద్రాల నిర్వహణకు అయ్యే ఖర్చులో కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు 80:15:5 దామాషాలో భరించాల్సి ఉంటుంది. ఈ కేంద్రాల విధులు, బాధ్యతలు ఇలా ఉంటాయి.

1. అభ్యాసకుల అవసరాలకు పరిస్థితులకు తగినట్లుగా పాఠ్య ప్రణాళికలను, బోధనా పరికరాలను, బోధనా సామగ్రిని తయారుచేయడం.

2. వయోజన విద్యా కార్యకర్తలకు అన్ని స్థాయిలలోను శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయడం, వారి శిక్షణకు అవసరమైన బోధనా సామగ్రిని సరఫరా చేయటం.

3. రాష్ట్ర, జిల్లా స్థాయిలలో ఉన్నటువంటి సాంఘిక మానవ వనరులను గుర్తించి అవి అన్ని స్థాయిాలతోను అందేటట్లు చూడటం.

4. ప్రస్తుతం ఉన్న సాహిత్యాన్ని సమీక్షించడం ద్వారానూ కొత్త సాహిత్యాన్ని తయారుచేసి ముద్రించటం ద్వారాను, బోధనా పరికరాలను అభివృద్ధి చేయటానికి తగినటువంటి మార్గదర్శక సూత్రాలను తయారుచేయటం, అక్షరాస్యతానంతర కార్యక్రమమునకు కావలసిన బోధనా సామగ్రి తయారు చేయడం.

5. గ్రామీణాభివృద్ధి శాఖ, ఆరోగ్యశాఖ, కార్మిక సంక్షేమం, సాంఘిక సంక్షేమం శ్రామిక విద్యా పీఠాలు మొదలైన సంస్థల సహాయంతో అధ్యాపకుల వృత్తినైపుణ్యాలను పెంపొందించుకునేందుకు అవసరమైన శిక్షణా కార్యక్రమాలను ఏర్పాటు చేయటం.

6. వయోజన విద్యా కేంద్రాలను అక్షరాస్యతానంతర విద్యా కార్యక్రమాలను ప్రయోగాత్మకంగా ఏర్పాటుచేసి వాటి ఫలితాలను క్షుణ్ణంగా పరిశీలించటం.

7. అభ్యాసకులను వయోజన విద్యా కేంద్రాలకు రప్పించేటట్లు చేయడం, వయోజనులు అభ్యసించే తీరుతెన్నులను పరీక్షించుటకోసం మూల్యాంకనం జరపటం.

8. షెడ్యూలు కులాలకూ, షెడ్యూలు తెగలకూ చెందిన స్త్రీలను వయోజన విద్యా కార్యక్రమంలో పాల్గొనేటట్లు చేయడానికి అవసరమైన ప్రదర్శనలు, పోస్టర్లు, ఇతర సామూహిక ప్రచార సాధనాలను, పరికరాలను రూపొందించటం.

9. వయోజన విద్యా కేంద్రాల్లోను, అక్షరాస్యతానంతర విద్యా కేంద్రాలలోను రేడియో, టి.వి., ఇతర దృశ్యశ్రవణ ఉపకరణాలను ఉపయోగించేందుకు తగిన ఏర్పాట్లు చేయడం.

10. రాష్ట్ర స్థాయిలో వయోజన విద్యా వ్యాప్తికి తగిన ప్రచారం చేయడం.

11. వయోజన విద్యను జనాభా విద్యతోనూ, మాతా శిశు సంక్షేమంతోనూ, పరిసరాల పరిరక్షణ కార్యక్రమాలతోనూ సంధాన పరచడం.

12. వయోజన విద్యా వ్యాప్తికి అవసరమైన ఇతర కార్యక్రమాలను ఎన్నింటినో రాష్ట్ర వయోజన విద్యా వనరుల కేంద్రం చేపడుతుంది. ఈ కార్యక్రమాలు చిన్న చిన్న పథకాలు రూపంలోనూ, పరిశోధనల రూపంలోనూ ప్రయోజనాత్మకంగాను ఉంటాయి. వీటిలో ఎక్కువ భాగం వెనుకబడిన స్త్రీల సంక్షేమం కోసం ఏర్పాటు చేస్తారు.

ఈ కేంద్రం కృషి :

మన రాష్ట్రంలోని వయోజన విద్యా వనరుల కేంద్రం ఈ దిగువ ఉదహరించిన కార్యక్రమాలు నిర్వహించింది.

1. అక్షరాస్యత, అక్షరాస్యతానంతర పఠనసామగ్రి తయారు చేసింది.

2. ''మనమాట'' పత్రికను 1986 వరకు నిర్వహించింది. నేడు SRC News letter నిర్వహిస్తుంది.

3. ప్రాజెక్టులు నిర్వహించే అధికారులకు శిక్షణా తరగతులు నిర్వహించింది.

4. వయోజన విద్యకు సంబంధించిన అనేక సభలను, సదస్సులను, గోష్టులను జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో నిర్వహించింది.

5. కొన్ని ప్రాజెక్టులను పరిశోధన నిమిత్తం ఎంపిక చేసి, తదుపరి చర్యకోసం ఒక మాస్టర్ ప్లాన్ తయారు చేస్తోంది.

**ముగింపు**

1978లో లాంఛనప్రాయంగా భారత ప్రభుత్వం తరపున ప్రారంభమైన ఈ కార్యక్రమం నేడు శాఖోపశాఖలుగా విస్తరించి అన్ని రాష్ట్రాలలో అమలు జరుగుతున్నది. రాష్ట్ర ప్రభుత్వాలు కూడ ఈ కార్యక్రమాలకు తగినంత చేయూత నిస్తూన్నవి. కనుక కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలసికట్టుగా వయోజన విద్యా కార్యక్రమాలు నిర్వహిస్తూ 1990 నాటికి 15-30 సంవత్సరాల వయసుగల వారిని విద్యావంతులుగా చేయాలనే కృతనిశ్చయంతో ఉన్నాయి. ఇందుకోసం కేంద్ర ప్రభుత్వం 550 కోట్లు ఖర్చుచేయడానికి వెనుకంజ వేయడం లేదు. ఈ

బృహత్తరమైన అక్షరాస్యతా ఉద్యమంలో ప్రతి ఒక్కరూ సహకరించాలనేదే నా విన్నపం. వాస్తవానికి జాతీయ అక్షరాస్యతా ఉద్యమం దేశప్రగతికి, ప్రజల సుగతికి మూలం. కోట్లాది ప్రజల జీవితాలను మెరుగుపరచే ఆశాదీపం. ''నిరక్షరాస్యత జాతికి కళంకం''- అని భారత జాతిపిత గాంధీజీ చెప్పినట్లు ఈ కళంకం పోగొట్టుకోవడానికి నిరంతరం కృషి. చేయడం అక్షరాస్యుల నైతిక బాధ్యత. కనుక జాతిపిత జన్మదినాన ప్రారంభమైన ఉద్యమం జాతికి వెలుగు ప్రసాదిస్తుందని నా నమ్మకం.



శ్రీ మండలి వెంకట కృష్ణారావు బహుముఖ ప్రజ్ఞాశాలి. సిసలైన గాంధేయవాది. అకుంఠిత సేవాతత్పరుడు. అన్నింటికి మించి వారు పేద, బడుగువర్గాల అభివృద్ధికి విసుగు విరామమెరుగక నిరంతరం పోరాడేవ్యక్తి. వారి స్వస్థలమైన అవనిగడ్డలో వారు స్థాపించిన గాంధీ క్షేత్రం ఈరోజు సమాజంలోని బలహీనవర్గాల ప్రయోజనాలకయి సమగ్ర అభివృద్ధికార్యకలాపాల కేంద్రమయింది. 1977 వ సంవత్సరములో ఆంధ్రకోస్తాతీరప్పు తుఫాను బాధితుల సహాయార్థం వారు మానవతాదృక్పథముతో చేసిన కృషి సర్వవిదితము. ఆపదలో ఉన్నవారిని ఆదుకొనుటలో వారికిగల ఆతురతకు, వారికిగల గొప్ప కార్యనిర్వహణ సామర్థ్యానికి ఇవి ప్రతీకలు. పదవిలో ఉన్నా లేకపోయినా వారు ఎప్పుడు ప్రజల మనిషిగానే ఉన్నారు. సహజ నిరాడంబరత్వము ప్రజాశ్రేయస్సునందు వారికిగల అవ్యాజమయినతపన వారిని అందరికి సన్నిహితులను చేశాయి. తనను మరచి తన సహచరులకు సేవచేయుటలోనే 'పరిపూర్ణజీవితం ఉన్నదనేది జగమెరిగిన సత్యం. శ్రీ కృష్ణారావుజీవితం ఈ లోకోక్తికి ప్రకాశమయిన ఉదాహరణ.

— డా॥ శంకరదయాళ్ శర్మ